**పుష్కరాంశ - ఒక అవగాహన**

(వివరణ:డి.నారాయణ రావు, విద్యానగర్, హైదరాబాద్, తెలంగాణా రాష్ట్రం)

శ్లో॥ఏకవింశోమనుశ్చైవచతుర్వింశతిసప్తచ।

మేషాదిమీనపర్యంతంపుష్కరాంశాఃప్రకీర్తితాః॥

మేషము మొదలుకొని మీనము వరకు గల ద్వాదశ రాశులలో వరుసగా 21వ, 14వ,24వ మరియు 7వ అంశములు పుష్కరాంశములని చెప్పబడుచున్నవి.

1.మేషం -- 21వ అంశము పుష్కరాంశ 7.తుల -- 24వ అంశము పుష్కరాంశ

2.వృషభం -- 14వ అంశము పుష్కరాంశ 8.వృశ్చికం -- 07వ అంశము పుష్కరాంశ

3.మిథునం -- 24వ అంశము పుష్కరాంశ 9.ధనుస్సు -- 21వ అంశము పుష్కరాంశ

4.కర్కాటకం -- 07వ అంశము పుష్కరాంశ 10.మకరం -- 14వ అంశము పుష్కరాంశ

5.సింహం -- 21వ అంశము పుష్కరాంశ 11.కుంభం -- 24వ అంశము పుష్కరాంశ

6.కన్యా -- 14వ అంశము పుష్కరాంశ 12.మీనం -- 07వ అంశము పుష్కరాంశ

లగ్నప్రమాణ కాలములు ఒక్కొక్క పఞ్చాఙ్గములో ఒక్కొక్క విధంగా ఇస్తున్నారు.పఞ్చాఙ్గములో మనకు కావసిన రోజున కావలసిన లగ్న ఆద్యంతమును చూసి దానికి మన స్థలానికి బీజసంస్కారము చేసి పుష్కరాంశ లెక్కించడం శ్రేయస్కరం.

ఉదాహరణకు భాస్కర పఞ్చాఙ్గం ప్రకారం మేష లగ్న ప్రమాణం -1 గం.45 ని.లు లేదా 105 ని.లు

దీనిలో 21వ అంశము పుష్కరాంశ

20 అంశములు పూర్తయ్యే సమయం= 105x20/30= 70 ని.లు అంటే 1గం.10 ని.లు

ఏకాంశ ప్రమాణం=105/30= 3 ని.ల 30 సెకండ్లు

21 అంశములు పూర్తయ్యే సమయం = 1గం.10 ని.లు+3 ని.ల 30 సెకండ్లు అంటే 1గం.13 ని.ల.30 సెకండ్లు

పుష్కరాంశ సమయం = 1గం.10 ని.ల నుండి 1గం.13 ని.ల 30 సెకండ్లు

ఇందులో పుష్కరాంశ మధ్యసమయం తీసుకుంటే ముహూర్తం బలవత్తరంగా ఉంటుంది. కాని చాలా పఞ్చాఙ్గాలలో పుష్కరాంశ అంత్యసమయం ఇస్తారు.దీనివల్ల ముహూర్తం బలహీనమవడమే కాకుండా గణనలో ఏమాత్రం తేడావచ్చినా లేదా ముహూర్తం కొద్దిగా అలస్యమైనా కూడా పుష్కరాంశ దాటిపోయే ప్రమాదం ఉన్నది.

పిడపర్తి వారి పఞ్చాఙ్గం ప్రకారం 28 మార్చి 2017 రోజున ఉదయం 06:57 కి మీన లగ్నాంతం

దేశాంతర చక్రము ప్రకారం హైదరాబాదుకి సవరణ +13. అంటే హైదరాబాదు కి మీనలగ్నాంతం 06:57+0:13=07:10

మేషలగ్న పుష్కరాంశ ప్రారంభ సమయం--07:10+1:10=08:20

మేషలగ్న పుష్కరాంశ సమాప్తి సమయం--07:10+1:13:30=08:23:30

మేషలగ్న పుష్కరాంశ మధ్య సమయం-- 08:22 a.m.